





# కథలు

## నీతి, పురాణ, పొడుపు

# దేశ దేశాల జానపద కథలు





# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120034315

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: In ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals
Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |

**Author's Last Name**

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |

**Year**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |

**Subject**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |

**Language**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# బుద్ధం శరణం గచ్ఛామి

## దేశదేశాల జానపద కథలు

పోలి శకుంతలా రెడ్డి



ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి

హైదరాబాద్

# 1. బుద్ధం శరణం గచ్ఛామి

[యుద్ధంవల్ల కంటే శాంతి, సామరస్యాల వల్ల ఎంతో మేలు జరుగుతుందని బుద్ధ భగవానుడు నిరూపించాడు. అది ఎలా జరిగిందో బుద్ధం శరణం గచ్ఛామి చదివితే తెలుస్తుంది.]

కంబోడియా, లావోస్ అనే రెండు ఇరుగుపొరుగు దేశాలు తమలో తాము యుద్ధ ప్రయత్నాలు చేస్తూ ఉండేవి. రెండు దేశాల మధ్య పారే ఒక నదిని గురించి వచ్చిన తగాదా అది. నది పేరు 'మీకాంగ్'. అది లావోస్‌లో పుట్టి కంబోడియా గుండా ప్రవహిస్తూంది.

ఆ నది రెండు దేశాలకూ చాలా ముఖ్యమైంది. మనకు గంగానది ఎంత పవిత్రమో వారికి 'మీకాంగ్' నది అంత పవిత్రమైంది అసలు 'మా గంగా' (తల్లి గంగ) నుండి 'మీకాంగ్' శబ్దం ఏర్పడిందని అంటారు.

రెండు దేశాల ప్రజలూ ఆ నదిని తల్లిలా పూజిస్తూండేవారు ఆ నది నీటివల్ల రెండు దేశాల పొలాలూ సస్యశ్యామలంగా ఉండేవి. ఎటు చూసినా పచ్చదనం కన్నుల పండువు చేసేది. రెండు దేశాలూ సుభిక్షంగా ఉండేవి. రెండు దేశాలూ 'మీకాంగు'ను తమ జీవనదాతగా భావించేవి. రెండు దేశాలూ ఆ నదిపైన తమ తమ అధికారాన్ని ప్రకటిస్తూ దాన్ని పూర్తిగా కైవసం చేసుకోవాలని అనుకొన్నాయి.

ఈ సమస్యతో ఆ దేశాలమధ్య పరిస్థితి విషమించింది. ఎంత విషమించిందంటే వారు ఒకరితో ఒకరు యుద్ధానికి సిద్ధపడి సేనలతో తరలివచ్చి ఎదురెదురుగా నిలిచారు.

ఆ సమయంలో బుద్ధ భగవానుడు అక్కడికి వచ్చాడు. ఆయన యుద్ధానికి సిద్ధపడిన రెండు దేశాల సైన్యాలనూ చూశాడు. అకస్మాత్తుగా బుద్ధ భగవానుని రాకకు రెండు దేశాల సైన్యాలలోనూ సంచలనం బయలుదేరింది.

బుద్ధుడు ఇరు దేశాల రాజులనూ, మంత్రులనూ ఇతర అధికారులనూ తనవద్దకు రమ్మన్నాడు. రెండు సైన్యాల మధ్యా నిలబడి ఆయన బిగ్గరగా ప్రశ్నించాడు. "మీరు ఎందుకు యుద్ధం చేయబోతున్నారు?"

"మా జీవనాధారమైన 'మీకాంగ్' నది నీరు కోసం." బుద్ధ భగవానుని ప్రశ్నకు ఆ జవాబు వచ్చింది.

'నది నీరు', 'మానవ రక్తం' ఈ రెండింటిలో ఏది విలువైనది? అని మళ్ళీ ప్రశ్నించాడు బుద్ధ భగవానుడు.

'మానవుని రక్తం నది నీరు కంటె ఎన్నో రెట్లు విలువైనది' అని ఒకేసారి ఇరు వైపులనుండీ జవాబు వచ్చింది.

"అలా అయితే మరి మీరు తక్కువ విలువ గల నీటి కోసం సర్వాధిక మూల్యమైన రక్తాన్ని ఎందుకు ప్రవహింప చేయాలనుకుంటున్నారు?" బుద్ధుడు మళ్ళీ ప్రశ్నించాడు.

"మా జీవనానికి 'మీకాంగ్' నది నీరు ఎంతయినా అవసరం" అని ఇరువైపుల నుంచీ జవాబు వచ్చింది.

'మీరు జీవించాలనుకుంటున్నారు కదా, మరి చావుకెందుకు సిద్ధపడుతున్నారు' బుద్ధుడు ప్రశ్నించాడు.

ఇరుదేశాల ప్రధానమంత్రులూ ఇలా జవాబిచ్చారు: 'స్వామీ! ఇరు దేశాల మధ్యా ఉన్న ఈర్ష్యవల్ల పరిస్థితి చాలా విషమించింది. దీనికి పరిష్కారం యుద్ధమే. వేరే పరిష్కారం లేదు.'

బుద్ధుడు ఇలా ప్రశ్నించాడు. 'ఈర్ష్యను ఈర్ష్యతోనే జయించాలనుకుంటే ఈర్ష్యకు అంతం ఎక్కడుంది?'

బుద్ధుని ప్రశ్నకు ఇరువైపులా శాంతి ఆవరించింది. ''జవాబు ఏమివ్వాలి? ఇక ముందేం చేయాలి?'' అని ఇరువైపుల వారు ఆలోచనలో పడ్డారు.



బుద్ధుని శాంతి ప్రతిపాదనను కాదనడానికి వారికేమీ తోచలేదు. చివరికి బుద్ధ భగవానుడు చెప్పినట్లే ఆ రెండు దేశాలు ఒక శాంతి సభను ఏర్పాటు చేశాయి.

శాంతి సభ రెండు దేశాల వాదోపవాదాలనూ శ్రద్ధతో విన్నది. ఆ సభ రెండు దేశాలకూ వెళ్ళి అక్కడి పరిస్థితులను స్వయంగా చూసి అర్థం చేసుకుంది.

బాగా ఆలోచించిన తర్వాత తుదకు ఆ సభ ఒక నిర్ణయానికి వచ్చింది. ఆ నిర్ణయాన్ని రెండు దేశాలూ ఒప్పుకున్నాయి. యుద్ధం ఆగిపోయింది.

వివేకంలో ఎనలేని బలం ఉందని అందువల్లనే అంటారు. దాని ద్వారా మానవుడు హింస వల్ల సర్వనాశనం తెచ్చిపెట్టే యుద్ధాలను కూడా ఆపగలడు. శాంతితో జీవనం గడిపేటట్లు చేయగలడు.

అందుకే అంటారు 'బలంకన్న వివేకం మిన్న' అని. *

# 2. పవిత్ర వృక్షం

[మన దేశంలోని కొన్ని ప్రాంతాల ప్రజలు రావిచెట్టును పవిత్రంగా భావిస్తారు. కొన్ని సందర్భాలలో దానిని పూజిస్తారు కూడా. ఏదో ఒక చెట్టును పవిత్రంగా భావించే ఈ నమ్మకం మన దేశంలోనే కాదు ఆగ్నేయాషియాలోని పెక్కు దేశాల ప్రజలలో కూడా ఉంది. ఇలాగే బాలి ద్వీపపు ప్రజలు కూడా అక్కడ ఒక వృక్షం "వారూ వంగి"ని పవిత్రంగా భావిస్తారు. దీని వెనుక ఒక రహస్యం దాగి ఉంది. ఆ రహస్యం తెలుసుకోవాలంటే మీరు ఈ బాలి జానపద గాథ చదవండి.]

చాల ఏళ్ళ క్రితం బాలీ ద్వీపంలో ఒక పర్వతం ఉండేది. దానిని "పవిత్ర పర్వతం" అనేవారు. ఆ పర్వత గుహలలో చాలా మంది పుణ్యాత్ములైన ఋషులు నివసించే వారు. వారిలో కొంత మంది ఋషులు అద్భుతశక్తి కలిగి ఉండేవారు వాళ్ళలో ఒక వృద్ధ ఋషి కూడా ఉండేవాడు. ఆయన ఎక్కువ దైవభక్తిసంపన్నుడూ, సర్వజ్ఞుడూ కూడా. అతనిని 'కవిజ్ఞేక్సేనా సర్వజ్ఞుడు" అని అంటూ ఉండేవారు. బాలి ద్వీపంలోనే కాక సుదూర ద్వీపాల నుండి కూడా ప్రజలు అతని దర్శనానికి వచ్చేవారు. అతనితో వారు తమ ఆపదల నివారణకు సలహాలు అడుగుతూండేవారు. వారికి కలిగిన ఎలాంటి కష్టాలకైనా కవిజ్ఞేక్సేనా పరిష్కారం చెప్పి తీర్చేవాడు.

అంత గొప్పవాడైనా కవిజ్ఞేక్సేనా సాధారణ జీవనాన్ని గడిపే వాడు. అతను 'సాధారణ జీవనం ఉన్నత భావం' అన్న ఆదర్శాన్ని పాటించేవాడు. అతను చర్మాన్ని ధరించేవాడు. పండ్లు, కందమూలాలు

ఆహారంగా తీసుకునేవాడు. అతను తరుచుగా ఉపవాసాలు కూడా చేసేవాడు.

అందువల్ల అతని శరీరం అస్థి పంజరంలా తయారయింది. అతను మిగతా ఋషులతో మాట్లాడేవాడు కాదు. అతను బ్రహ్మతోను, అతని దగ్గరికి సమస్యలతో వచ్చేవారితోనూ మాత్రమే మాట్లాడేవాడు.

కొంతకాలం తర్వాత నిజంగా దైవభక్తిలేని మిగతా ఋషులు అతనిని చూసి అసూయపడేవారు వారి దగ్గరికి ఎవ్వరూ తమ సమస్యల పరిష్కారంకోసం వచ్చేవాళ్ళు కాదు. అంతా కవిజ్ఞేక్సేనా దగ్గరికి వెళ్ళేవారు. ఈ విషయం మిగతా ఋషులకు దుస్సహం అయింది. అసూయతో వాళ్ళంతా వృద్ధుడూ, దుర్బల శరీరుడూ అయిన కవిజ్ఞేక్సేనాను అన్ని విధాలా కష్టపెట్టసాగారు. కుళ్ళిన పళ్ళను అతనిపైకి విసిరేవారు. రాళ్ళు రువ్వి అతనిని గాయపరిచేవారు. అయినప్పటికీ ఆ మహాత్ముడు తన ప్రాణంతో ఎందుకు ఆడుకుంటున్నారని తన సహధర్ములను ఎప్పుడూ ఆయన అడుగలేదు. బ్రహ్మతోకూడా ఈ విషయాన్ని గురించి అతను చర్చించ లేదు.

ఋషులదాడితో గాయపడిన కవిజ్ఞేక్సేనా చాలా రోజులు నిద్రాహారాలు మాని తన గుహలోనే ఉండేవాడు. అతని శరీరం మరింత క్షీణించింది. ఆఖరికి ఒకరోజు భరించరాని ఆకలి అయినప్పుడు కందమూలాలను వెతుక్కుంటూ తన గుహనుండి అతను బయటికి వచ్చాడు. క్రమంగా అతను పర్వత శిఖరం చేరేటప్పటికి మిగతా ఋషులు అతన్ని చూసి అతని వెంట పడ్డారు. వాళ్ళంతా ఆ మహాత్ముని ఆ శిఖరం నుండి కిందికి త్రోసివేయాలని నిశ్చయించుకొన్నారు. ఈ శిఖరానికి సరిగ్గా కింద ఒక సూటిగా ఉన్న రాయిని కూడా పాతి పెట్టారు.-అతను కింద పడుతూనే తల పగిలేటట్టుగా.

తపస్వి కవిత్జైక్స్నాకు తన ఆంతర దృష్టి ద్వారా వాళ్ళ పథకం తెలిసిపోయింది. ఋషులు వాళ్ళ పథకం ప్రకారం ఆతణ్ణి కిందికి తోశారంటే ప్రాణాలు ఎగిరిపోతాయని తెలిసికొన్నాడు. ఇక వేరే దారిలేక అతను వెంటనే ఈ ఆపద నుండి తప్పించుకోవటానికి ఏదైనా ఉపాయం చెప్పమని బ్రహ్మను ప్రార్థించేడు. వెంటనే ఒక పెద్ద పామువచ్చి ఆ దుష్ట ఋషుల కాళ్ళదగ్గర పడింది. మొదట వాళ్ళు పామును చూసి వెనక్కు తగ్గారు. మేము ఋషులం మమ్మల్ని పాము ఏమి చేస్తుందిలే అని కవిత్జైక్స్నాను కిందికి తోయటానికి తమ పథకం ప్రకారం ఆతని దగ్గరికి వెళ్ళారు.

అప్పుడు బ్రహ్మ పంపిన పాము వెంటనే కవిత్జైక్స్నా ముందుకు వచ్చి, తన తోకను భూమిలోనికి గుచ్చి పడగ పైకిఎత్తి నిలబడింది. చూస్తూ చూస్తూనే ఆ పాము ఒక 'వారువంగి' వృక్షం (బాలి ద్వీపంలో



దొరికే గట్టి చెక్కగల ఒక వృక్షం)గా మారింది. ఆ పాముతల అనేక కొమ్మలుగానూ, దాని విషం చుక్కలు దట్టమైన ఆకులుగానూ మారాయి.

ఇదంతా చూసి మిగతా ఋషులంతా ఆశ్చర్య చకితులయ్యారు. కవిజ్జేక్సెనా మహిమవల్లనే ఇదంతా జరిగిందని వాళ్ళు తెలిసికొన్నారు. అతనిని క్షమాపణ కోరుతూ వాళ్ళంతా అతని కాళ్ళమీద పడ్డారు. ఇంతలో ఒక ఋషి చెట్టు పైకెక్కి ఒక కొమ్మతుంచి తెచ్చి దానిని ఒక తీక్షణమైన ఈటెగా చేసి కవిజ్జేక్సెనాకు ఇస్తూ ''మహాత్మా! దీనిని స్వీకరించండి. ఇంకెప్పుడైనా మీతో మేము చెడ్డగా ప్రవర్తిస్తే దీనితో మమ్మల్ని చంపివేయండి'' అని ప్రార్థించాడు.

ఈ విషయం చెప్పేలోగా అక్కడ ఇంకొక అద్వితీయ సంఘటన జరిగింది. ఎప్పుడైతే కవిజ్జెక్సెనా ఆ కర్రను చేతిలోకి తీసుకొన్నాడో అప్పుడే ఒక పదునైన ఈటె వచ్చి ఆ కర్రకు తగులుకుంది.

ఋషులు అది చూసి ఆ మహాముని కాళ్ళపై పడి ''మీరు సాక్షాత్తు బ్రహ్మ అవతారులు, మాలాంటి దుష్టులకు సన్మార్గం ప్రసాదించండి'' అని ప్రార్థించారు.

పై సంఘటనల కారణంగా ఇప్పటికీ ఆ ద్వీపపు ప్రజలు 'వారూ వంగి' వృక్షాన్ని చాలా పవిత్రంగా పూజిస్తారు. పర్వతాలలో ఎక్కడైనా ఈ చెట్టు మొలవడం చూస్తే చాలా సంతోషిస్తారు. ఎక్కువ ఆనందంతో ఊగిపోతారు. ఈ వృక్షం బ్రహ్మ పంపిన పాము నుంచి మొలుస్తుందని వాళ్ళ విశ్వాసం.

బాలిద్వీపపు ప్రజలు ఇప్పుడు కూడా 'వారు వంగి' వృక్షపు కర్రనే ఈటెను చేయటానికి ఉపయోగిస్తారు. ఈ చెట్టులో చాల మహిమ ఉందని వాళ్ళ నమ్మకం. ఈ కర్రతో చేసిన ఈటె ఎవరి చేతిలో ఉంటే విజయం వాళ్ళదేననీ, యుద్ధంలో ఎక్కువ శ్రమలేకుండానే శత్రువులను దీనితో ఓడించవచ్చనీ వాళ్ళ నమ్మకం. *

# 3. హనుమంతుని పర్వతం

[మన దేశానికి ఆగ్నేయ దిశలో ఉన్న ఇండోనీషియా ద్వీపాలలో 'జావా' ఒకటి. అక్కడ పురాతన కాలంనుంచీ మన 'రామాయణం' ఎక్కువ ప్రచారంలో ఉంది. శ్రీరామునివలెనే, హనుమంతుని కూడా వారు ఎంతో భక్తితో పూజిస్తారు. అక్కడి నాట్యాలలో, కథలలో, గీతాలలో రామ గాథలు ఎక్కువగా ఉంటాయి. జావా దీవిలోని ఒక పర్వతాన్ని "హనుమంతుని పర్వతం-కోరాంగ్" అంటారు.

ఆ పర్వతానికి ఆ పేరు ఎలా వచ్చిందో వారు చెప్పుకునే కథ ఇది:]

ఇండోనీషియాలోని జావా ద్వీపంలో కోరాంగ్ పర్వతం బంటమ్ రాజ్యానికి ఉత్తరంగా సుమిత్రా, జావాల మధ్యనున్న 'సుండా' జల సంధిలో ఉంది. ఒకప్పుడు కోరాంగ్ పర్వతం చాలా ఎత్తయినదనీ, దాని శిఖరాలు నక్షత్రాలను తాకుతూ ఉండేవనీ, వాయుపుత్రుడు హనుమంతుడు వాటిని నిర్మించాడని అక్కడి బదూవీ ప్రజల విశ్వాసం. వానరుల రాజు హనుమంతుడు భూమి మీద ఒకసారి తిరుగుతూ, ఒక రోజున తన ప్రజల దగ్గరకు వచ్చాడనీ, అప్పుడు అతను తన భుజాలమీద రెండు బరువైన ఇసుక బస్తాలు తెచ్చాడనీ వారి నమ్మకం.

హనుమంతుడు తన ప్రజల సహాయంతో 'సుండా' జలసంధిలో రెండు చిన్న ద్వీపాలను నిర్మించాలనుకున్నాడు. అతడు అక్కడికి

వచ్చేటప్పటికి చాలా అలసిపోయాడు అతనికన్నా ముందే అక్కడికి ఒక దేవత వచ్చి సుండా జలసంధిలో కర్కటూ, బేషీ, ద్వరాపినాదేగ్ అనే మూడు చిన్న చిన్న ద్వీపాలను నిర్మించడం చూసి అతనికి చాలా ఆశ్చర్యమూ, కోపమూ కలిగాయి వానరుల రాజు హనుమంతుడు కోపంతో రెండు బస్తాలనూ చించి, విసిరివేయగా ఆ ఇసుక సముద్రపు అలలమీద కొట్టుకొనిపోయింది. కాని కొంత సేపటికి ఇసుక మరల కలసి పోయి చూస్తూ ఉండగానే అక్కడ రెండు పెద్ద పర్వతాలు ఏర్పడ్డాయి.

హనుమంతుడు ఆ రెండు పర్వతాలలో ఒక దానికి "కోరాంగ్" అనీ రెండోదానికి "వూలోశ్రీ" అనీ పేర్లు పెట్టాడు. 'వూలోశ్రీ' మామూలు పర్వతంగా పెరిగి ఆగిపోయింది. కాని కోరాంగ్ పైభాగం హనుమంతుని తోకలాగ అనంతంగా పెరుగుతూ పోయింది. ఆఖరికి దాని శిఖరం ఆకాశాన్ని తాకింది.

హనుమంతుని వానర సేన అంతవరకూ నిలబడి ఈ తమాషా అంతా చూస్తూ ఉంది. 'కోరాంగ్' పర్వతం ఆకాశాన్నంటడంతో కోతులు సంతోషంతో నాట్యం చేస్తూ ఒక్కొక్కటే ఆ పర్వతాన్ని ఎక్క సాగాయి.

ఆఖరికి అన్ని కోతులూ దానిపైకి ఎక్కాయి. తమ రాజు తమకు ఆడుకోవటానికి ఈ పర్వతాన్ని నిర్మించాడని కోతులు అను కొన్నాయి. కొన్ని కోతులు ఆడుకొంటూ, ఆడుకొంటూ పర్వత శిఖరాన్ని చేరుకొని అక్కడ ఆకాశంలోని నక్షత్రాలను పట్టుకోసాగాయి. నక్షత్రాలు వీటిని చూసి భయపడటంతో కోతులు వాటిని తరిమి తరిమి కొట్టసాగాయి.

ఆకాశంలోని దేవతలు ఇదంతా చూసి సృష్టికర్త అయిన బ్రహ్మతో ఇలా మొరపెట్టుకున్నారు: "ఓ భగవంతుడా! చూడండి హను

మంతుని తుంటరిసేన వచ్చి మా నక్షత్రాలను ఎలా కష్టపెడుతుందో! మీరు ఆజ్ఞ ఇస్తే మేము కోతులను అక్కడి నుంచి తరిమివేస్తాం."

అప్పుడు బ్రహ్మదేవుడు ఇలా అన్నాడు: "ఏమీ భయపడవలసిన అవసరంలేదు. కొంతసేపటికి కోతులు ఆడి ఆడి అలసిపోతాయి. కొంచెం ఓపిక పట్టండి." బ్రహ్మదేవుని మాట విని దేవతలు అప్పటికి ఊరుకున్నారు.

ఒక రోజు సాయంత్రం ఒక పెద్ద కోతి సంధ్యా నక్షత్రాన్ని గట్టిగా కొట్టింది. పాపం, సంధ్యానక్షత్రం గాబరా పడి, భయంతో వెంటనే మేఘాల్లో దాక్కుంది. ఈ సారి విష్ణువు స్వయంగా బ్రహ్మ దగ్గరకు పోయి అంతా చెప్పాడు.

బ్రహ్మదేవుడు ఇలా అన్నాడు: "ఇప్పుడు సంధ్యా నక్షత్రం మేఘాల్లో ఉంది. కోతులు అక్కడికి పోలేవు. ఉదయం వరకు వేచి చూడండి, తర్వాత చూద్దాం."



మరుసటిరోజు ఉదయం వేగుచుక్క చాలా అందంగా మెరుస్తూ ఆకాశంలో కన్పించింది. కోతులు నక్షత్రాలను ఎలా కష్టపెడతాయో చూడటానికి ఆరోజు ఉదయం నుండీ బ్రహ్మదేవుడు స్వయంగా అక్కడికి వచ్చి ఆకాశంలో నిలచి ఉన్నాడు.

తెల్లవారుతూనే కోతుల గుంపు కోరాంగ్ శిఖరాన్ని ఎక్కి ఆ మనోహరమైన వేగుచుక్కను నాలుగుపక్కలా చుట్టుకొని దానిపైకి దాడిచేశాయి. నక్షత్రం భయంతో మేఘాల్లో దూరాలనుకొంది. కాని ఎక్కడా మేఘం కనిపించకపోయేటప్పటికి అది "సృష్టికర్తా! రక్షించు! రక్షించు!" అని గోలపెట్టింది.

వేగుచుక్క అరుపు విని చిన్న, పెద్ద నక్షత్రాలన్నీ గట్టిగా అరవసాగాయి. అవి బ్రహ్మదేవుణ్ణి రక్షించమని ప్రార్థించాయి.

అప్పుడు బ్రహ్మదేవుడు 'బంటము' రాజయిన లూరూ ఘలామును పిలిచి, 'నీవు వెంటనే హనుమంతుని నా వద్దకు తీసుకురమ్మ'ని ఆజ్ఞాపించాడు.

లూరూ ఘలాము హనుమంతుని దగ్గరకు పోయి బ్రహ్మదేవుని ఆజ్ఞను వినిపించగా హనుమంతుడు "ఎందుకు? ఏమిటి సంగతి?" అని అడిగాడు. సమాధానంగా లూరూ ఘలాము ఇలా అన్నాడు: "బహుశా వారు మీకు ఒక పెద్ద కత్తెర ఇచ్చి కోరాంగ్ పర్వత శిఖరాలను కత్తిరించ మంటా రనుకొంటాను."

"ఎందుకని? ఎవరో చెప్పారని నేను నాకు ప్రియమైన పర్వత శిఖరాలను ఎందుకు నేను ఖండిస్తాను? బ్రహ్మదేవునికి సముద్రాన్ని మథించడానికి పర్వతాలు అవసరమైతే కర్కట్లూ, బేపీ, ద్వారాసినదేగా పర్వతాలను ఖండించి ఆయన ఉపయోగించుకోవచ్చును".

లూరాఘలామ్‌కు కోపంవచ్చి బ్రహ్మ ఆజ్ఞను ధిక్కరించవద్దని హెచ్చరించాడు.

హనుమంతునికి బ్రహ్మదేవుని ఆజ్ఞను పాటించాల్సిందే అనిపించి వెంటనే ఆయన సృష్టికర్త దగ్గరకి వెళ్ళాడు.

బ్రహ్మ అతనికి ఒక పెద్ద కత్తెరనిస్తూ, ''భూమిమీదికి వెళ్ళు, కోతులు ఎప్పుడూ ఏ నక్షత్రాన్నీ బాధపెట్టకుండా ఉండేందుకు వీలుగా కోరాంగ్ పర్వతంలో మూడో వంతు భాగం కత్తిరించి వేయి''.

అప్పుడు హనుమంతుడు, కత్తిరించిన భాగాన్ని ఎక్కడ ఉంచాలో చెప్పమన్నాడు.

బ్రహ్మదేవుడు, ''ముందు దాన్ని కత్తిరించేయి, తర్వాత అంతా సరిపోతుంది'' అన్నాడు హనుమంతునితో.

హనుమంతుడు కత్తెర తీసుకొని భూమిమీదికి వచ్చాడు. కోరాంగ్ పర్వతం పైకి ఎక్కి కత్తెరతో పర్వతంలో మీది మూడవ వంతు భాగాన్ని కత్తిరించాడు.

అది పెద్ద శబ్దం చేస్తూ సముద్రంలో పడిపోయింది. బ్రహ్మ ఇష్టం ప్రకారం దానితో అక్కడ చిన్నవీ పెద్దవీ అయిన అనేక జ్వాలాముఖీ పర్వతాలు ఏర్పడ్డాయి.

తమ జాతిలోని దుష్ట ప్రజలను శిక్షించుటకే బ్రహ్మదేవుడు హనుమంతుని కోరాంగ్ పర్వతపు ముక్కలతో సుండా జలసంధిలో ఈ జ్వాలాముఖులను నిర్మించాడని బదూనీ ప్రజలు అంటారు.

అందువల్లనే పాపం చేసినవారి ఆత్మలు అగ్ని దూతల ద్వారా ఇక్కడికి తేబడతాయి. ఇక్కడ వారు రక రకాల కఠినమైన శిక్షలు అనుభవించవలసి వస్తుంది.

*

# 4. తరగని చెట్టు

[పొదుపుగా ఖర్చుపెడుతూ కష్టపడి సంపాదించిన డబ్బు దానికదే ఆ తర్వాత రెట్టింపు అవుతుంది. విలాసాలకు పోయి ఉన్న ధనం ఖర్చు చేస్తే వికారులు కావటం తథ్యం, అనే నీతిని తెలియజెప్పే చైనా దేశపు జానపద కథ తరగని చెట్టు.]

పూర్వం చైనా దక్షిణ సముద్రతీరాన 'స్వతేవు' ఓడరేవు దగ్గర గ్యాన్‌హాంగ్, హయాంగ్ అనే ఇద్దరు చైనా వర్తకులు ఇరుగు పొరుగున ఉండేవారు. ఇద్దరూ చిన్ననాటినుంచీ ప్రాణస్నేహితులు. వారు 'స్వతేవు' ఓడరేవు దగ్గర చిన్న చిన్న వస్తువులను అమ్మి జీవనం గడుపుకునేవారు.

ఒకరోజు భయంకరమైన పెనుగాలి, తుఫాను వచ్చి ఆ ఓడరేవును పూర్తిగా ధ్వంసం చేసింది. ఈ తుఫానువల్ల ఓడరేవు చుట్టుపక్కల ఉన్న ఇళ్ళు కూలిపోయాయి. గ్యాన్‌హాంగ్, హయాంగ్‌లు కూడా చాలా నష్టపడ్డారు. వాళ్ళ వ్యాపారం కూడా దెబ్బ తింది. అయినా వారు నిరాశ పడలేదు. థాయిలాండ్ వెళ్ళి వ్యాపారం చేయాలని వారం రోజులు చాలా కష్టపడి దారి ఖర్చులకు సరిపడే కొంత డబ్బు సంపాదించారు.

ఒకరోజు వాళ్ళు థాయిలాండ్‌కు ప్రయాణమయ్యారు. వాళ్ళ దగ్గర కొంచెం డబ్బు, వేసుకున్న దుస్తులు తప్ప ఇంకేమీ లేవు. కొద్ది రోజులు ఓడలో ప్రయాణించి థాయిలాండ్ అఖాతం చేరుకున్నారు. అక్కడినుంచి 'మేనమ్' నదిద్వారా థాయిలాండ్ రాజధాని 'బాంకాక్' నగరాన్ని చేరుకున్నారు. వాళ్ళిద్దరూ అక్కడే తమ వ్యాపారం ప్రారంభించాలని నిర్ణయించుకున్నారు.

వాళ్లిద్దరూ కలసి ఒకచోట వ్యాపారం చేయకూడదనీ, ఒకరు బాంకాక్ ఉత్తర దిశకూ, మరొకరు దక్షిణదిశకూ వెళ్ళాలనీ అనుకున్నారు. తమ వీలునుబట్టి వివిధ వస్తువులతో వ్యాపారం చేయాలనీ, తక్కువ డబ్బు ఖర్చు పెట్టాలనీ, వ్యాపారంలో అన్ని మెళకువలూ ప్రదర్శించి యాభై చాంగ్‌లు సంపాదించిన తరువాతనే తిరిగి వారు ఒకరినొకరు కలుసుకోవాలనీ ఒప్పందం చేసుకున్నారు.

"తాము యాభై చాంగ్‌లు సంపాదించేవరకూ సాదా జీవితం గడపాలనీ, బాగా కష్టపడి పనిచేయాలనీ, బియ్యం, ఊరగాయ, ఉప్పు, సముద్రపు చేపలు తినాలనీ, పంది, బాతు, కోడి మాంసం వంటి ఖరీదైన వస్తువులు తినకూడదనీ" వాళ్ళిద్దరూ వాగ్దానాలు చేసుకొని తమ తమ దిశలకు వ్యాపారం నిమిత్తం వెళ్ళిపోయారు.

గ్యాన్‌హాంగ్ తమ ఒప్పందాన్ని అక్షరాలా పాటిస్తూ కష్టపడి పనిచేయసాగాడు. మామూలు ఆహారం తిని జీవించసాగాడు. ఎప్పుడూ రుచికరమైన వస్తువులను కన్నెత్తి కూడా చూడలేదు. తన వ్యాపార విషయంలో నమ్మకంగా, కలుపుగోలుగా ఉండేవాడు. అతని సాధారణ జీవితాన్ని సుగుణాలను చూసి అక్కడి ప్రజలు చాలా ఆకర్షితులయ్యారు.

వ్యాపారం బాగా జరగసాగింది. ఆ ప్రాంతంలో అతను మంచి పేరూ, పేరుతోపాటు డబ్బూ కూడా బాగా సంపాదించాడు. ప్రణాళిక ప్రకారం త్వరలోనే యాభై చాంగ్‌లు సంపాదించాడు. అయినప్పటికీ అతను సాధారణ జీవితమే గడిపేవాడు. అతను నూరు చాంగ్‌లు సంపాదించిన తర్వాత, తన వ్యాపారానికి ఇంకేమి ఆటంకం లేదని తన సంపాదనతో తృప్తిపడి, మంచి ఇల్లు కట్టించాడు. పెళ్ళి కూడా చేసు

కున్నాడు. తర్వాత మంచి ఖరీదైన ఆహారం తింటూ సంతోషంగా జీవించసాగాడు.

బాంకాక్‌కు రెండవ వైపుగా బయలుదేరిన హోయాంగ్ కూడా ఏదో వ్యాపారం ప్రారంభించాడు. తన కష్టానికి తగ్గట్టు అతనికి డబ్బు వచ్చేది. తన మిత్రునికి ఇచ్చిన మాట ప్రకారం అతను కూడా మొదట మామూలు ఆహారమే తింటూ ఉండేవాడు. కాని ఒకే రకపు ఆహారం తిని తిని అతనికి విసుగనిపించింది. దీంట్లో రుచిగాని శక్తిగాని లేదని అనుకున్నాడు. "నేను రోజు రోజుకి బలహీనమైపోతున్నాను. అక్కడ నా స్నేహితుడు గ్యాన్‌హోంగ్ మంచి భోజనం తింటున్నాడేమో, అతను నా కోసమే ఈ విధమైన నియమాన్ని పెట్టాడేమో" అని అనుకున్నాడు.

'డబ్బు కూడబెట్టవలసిందే కాని, రోజూ నేను సాధారణమైన తిండి కోసం ఎంత డబ్బు ఖర్చుపెడుతున్నానో అంతే డబ్బుకు ఏదైనా బాతు దొరికితే దాన్ని తినడంలో తప్పేముంది?' అని సమర్థించుకున్నాడు హోయాంగ్.

ఒక రోజతనికి తక్కువ ధరలో ఒక బాతు దొరికింది. ఆ బాతు ఏదో జబ్బుతో చనిపోయింది. అందుచేత తక్కువ ధరకే దొరికింది. హోయాంగ్ దాన్ని కొని తిన్నాడు. చాలా రోజుల తర్వాత బాతు మాంసం తిన్నందువల్ల అతనికి కుళ్లిన బాతు మాంసం కూడా రుచిగానే అనిపించింది.

మరునాడు అక్కడే ఇంకొక చనిపోయిన బాతును కొన్నాడు. కాని ఆ రోజతనికి ఆ మాంసం రుచించలేదు. మూడవ రోజతను బతికి ఉన్న మంచి బాతును కొని తిన్నాడు. దాని మాంసం అతనికి చాలా రుచిగా ఉంది. రోజూ బాతు, కోడి, పంది రక రకాల జంతువుల మాంసం తినేవాడు.

కడుపునిండా మంచి ఆహారం పడితే నిద్ర కూడ ఎక్కువగా వస్తుంది. మరి మనిషి సోమరి కూడా అవుతాడు. హాయాంగ్ రోజూ కడుపునిండా తిని హాయిగా కాలం గడిపేవాడు. రోజూ సంపాదించిందంతా ఖర్చు చేసేవాడు. అందువల్ల అతను ఏభయి చాంగులు కూడబెట్టలేకపోయాడు.

ఒక రోజు హాయాంగ్‌కు తన స్నేహితుని చూడాలనిపించింది. అతను అక్కడినుంచి బాంకాక్‌కు ప్రయాణమయ్యాడు. అక్కడికి వెళ్ళిన తర్వాత తన స్నేహితుడు ఒక పెద్ద భవనంలో ఉంటున్నాడని తెలిసి చాలా ఆశ్చర్యపడ్డాడు. అతని దగ్గరకు వెళ్ళి తన స్థితిని గురించి తెలిపాడు.

స్నేహితుడు అతనిని ఏమీ అనలేదు. హాయాంగ్ ఇష్టం ప్రకారం అతన్ని గ్యాన్‌హాంగ్ తన దగ్గరే ఉంచుకున్నాడు. అతనికి రోజూ అన్నం, ఊరగాయ, ఉప్పు, సముద్రపు చేపలూ పెట్టేవాడు.



కొద్దిరోజుల తర్వాత అతనికి విసుగనిపించి ఆ ఆహారంతో పాటు చింతాకులు కూడా ఉడికించి తింటానని తన మిత్రుణ్ణి అడిగాడు. తన మిత్రుడి ఇష్టం ప్రకారమే తన తోటలోని ఒక చిన్న చింతమొక్కను చూపించి "దీని ఆకులు నీవు బియ్యంతో ఉడికించి తింటూండు" అన్నాడు.

మరునాటి నుండి హాయాంగ్ అ మొక్క ఆకులు తుంచి బియ్యంతోపాటు ఉడికించి తిన సాగాడు. కొన్ని రోజుల తర్వాత ఆ మొక్క ఆకులన్నీ అయిపోయాయి. మోడు మాత్రం మిగిలింది. తర్వాత అది కూడా ఎండిపోయింది.

హాయాంగ్ స్నేహితుని దగ్గరికి వెళ్ళి 'ఆ మొక్క ఆకులు అన్నీ అయిపోయాయి. మొక్కకూడ ఎండిపోయిం'దని చెప్పాడు. అప్పుడు అతని స్నేహితుడు ఏమీ అనలేదు.

"మరేం పర్వాలేదు. నేను నీకోసం వేరే ఏర్పాటు చూపెడతాను. నీవు రేపు నాకు గుర్తుచెయ్యి" అన్నాడు.

మరునాడు హాయాంగ్‌కి మిత్రుడు తన తోటలోని ఒక పెద్ద చింతచెట్టును చూపించి ఈ చెట్టు ఆకులు తినమన్నాడు. "ఈ చెట్టు ఆకులు కూడా అయిపోయినప్పుడు నాతో చెప్పు. నేను నీకు మాంసం చేపలున్న మంచి భోజనం ఏర్పాటు చేస్తా" అన్నాడు. హాయాంగ్ చాలా సంతోషించాడు. త్వరగా ఈ చెట్టు ఆకులన్నీ తింటాను. తర్వాత నాకు మంచి భోజనం లభిస్తుందని హాయాంగ్ అనుకున్నాడు.

హాయాంగ్ బియ్యంలో ఎక్కువ మోతాదు చింతాకులు వేసి ఉడికించి తినసాగాడు. కాని నెలల తర్వాతకూడా ఆ చెట్టు ఆకులు అయిపోలేదు. అతనికి చాలా నిరాశ కలిగింది.

చివరికి ఒకనాడు హాయాంగ్ మిత్రుని దగ్గరికివెళ్ళి "నేను రోజూ ఎక్కువ ఆకులు తింటున్నాను. అయినా ఆ చెట్టు ఆకులు తరగలేదు. ఈ రోజు నేనెన్ని ఆకులు తుంచు తానో, అన్నీ మరుసటిరోజు చిగురిస్తున్నాయి. నాకు చాలా విసుగ్గాఉంది. ఏదైనా దారి చూపు" అన్నాడు.

తన మిత్రుని మాటలు విని గ్యాన్ నవ్వి భుజం మీద చెయ్యివేసి ఇలా అన్నాడు: " ఇది అలానే జరుగుతుంది. ప్రపంచ రీతే అంత! నీ సంపాదన చిన్న చింతమొక్కంత ఉన్నపుడు నీవు దాన్ని వెంటనే ఖర్చు పెట్టేశావు. అందువల్ల అది వృద్ధి కాలేదు. ఆఖరికంతా అయిపోయింది.

కాని నేను నా శ్రమ, శ్రద్ధవల్ల మొదటి చిన్న చింతమొక్కలా సమానంగా ఉన్న నా సంపాదనను పెంచుకున్నాను. వానిలో మిగిలించి ఆ మొక్కను పెద్ద చింత చెట్టులా చేశాను. అందువల్ల దానినుండి ఎంత ఖర్చుచేసినా పెరుగుతుందేకాని తరగదు. ఎప్పటికీ అంతమవదు కూడా."

మిత్రుని మాటలకు హాయాంగ్ చాలా సిగ్గు పడ్డాడు. "నాకు మంచి గుణపాఠం నేర్పావు. నేను ఈ పాఠాన్ని జీవితాంతం గుర్తుంచుకుంటాను. నేను కూడా నీలాగే పనిచేస్తాను. నా సంపాదన పెద్ద చింత చెట్టు మాదిరిగా అయేటంతవరకూ ఖర్చు తగ్గించుకుంటాను అది వృద్ధి అయిన తర్వాతే నేను మళ్ళీ నీకు నా ముఖం చూపిస్తాను" అని వెళ్ళిపోయాడు.

*

# 5. ఆకాశపు కన్నీరు

[పిల్లలు ఏడుస్తారు. వారు ఏడుస్తూ కన్నీరు కారుస్తారు. అప్పు డప్పుడూ ఎక్కువకష్టం ఎదురైనప్పుడు పిల్లలేకాదు, పెద్దలు కూడా కన్నీరుకారుస్తారు. నిట్టూర్పులు కూడా విడుస్తారు. కాని మానవుడే కాదు, ఆకాశం కూడా ఏడుస్తుంది. అది కన్నీరుకూడా కారుస్తుంది నిట్టూర్పులూ విడుస్తుంది. మీరు దీనిని నమ్ముతారా? మీరు నమ్మండి నమ్మకపోండి న్యూజిలాండ్ ప్రజలు ఈ మాట నమ్ముతారు. ఆకాశం, భూమి వాళ్ళ తల్లిదండ్రులని వాళ్ళు అంటారు. వాళ్ళిద్దరుగా (ఆకాశం, భూమి) ఎడ బాటు కలిగితే ఏడుస్తారు. కన్నీరు కారుస్తారు. నిట్టూర్పులు విడుస్తారు. మంచు ఆకాశపు కన్నీరు. మనం చూసే పొగమంచు భూమి నిట్టూర్పు. ఈ కథ చదివితే మీకే తెలుస్తుంది].

**న్యూజిలాండ్** ప్రజలు ఆకాశాన్ని జగత్ పిత, భూమిని జగ న్మాతగా భావిస్తారు. వారు ఆకాశాన్ని 'రంగీ' అనీ, భూమిని 'పాపా' అనీ పిలుస్తారు. ఆదిమ కాలంలో ప్రపంచమంతా అంధకారంలో మునిగి ఉండేదనీ, అమ్మా-నాన్నా అంటే భూమి, ఆకాశం అతి సమీపంలో పక్క పక్కనే ఉంటూండే వారనీ అక్కడి ప్రజలు అనుకుంటూంటారు. వారికి చాలా మంది పిల్లలు ఉండేవారు. ఆ పిల్లలంతా ఆ చీకట్లోనే చాలీ చాలని ఆవరణలో వెలుగుకోసం ఆతురపడుతూ ఉండేవారు.

"కాంతి కిరణాలు ప్రసరించి ఈ గాఢాంధకారం నుంచి బయట పడి వెలుగులో ఆనందాన్ని అనుభవించే భాగ్యం కలిగితే ఎంత బాగుం టుంది!" అనుకునేవారు పిల్లలు. చాలీచాలని ఆవరణంలో విసుగెత్తిన

ఆ పిల్లలు విశాల ప్రపంచంలో విహరించాలని తహ తహ లాడేవారు. వెలుతురు ఎలా లభిస్తుందని వారు ఆలోచించసాగారు. అమ్మా నాన్నలను విడదీస్తే కాంతికిరణాలు ప్రసరించవచ్చుననే ఆలోచన కలిగింది వారికి.

వెలుగు లభించి ఈ ఇరుకైన ఆవరణ నుండి తమకు విముక్తి ఏర్పడాలంటే అమ్మా, నాన్నలను ఒకరినుంచి మరొకర్ని దూరంగా ఉంచటం అవసరమనే నిర్ణయానికి వచ్చారు వారంతా. మరి వారిని విడదీయటం ఎలా?

అమ్మా, నాన్నలకు పోట్లాట పెట్టాలన్నాడు ఒకడు. ఇద్దరినీ దూరంగా ఈడ్చి పారేయాలన్నాడు మరొకడు. భూమ్యాకాశాల ముద్దు బిడ్డ తనే అని భావించేవాడు ఒకడు ఉండేవాడు. అతడు వనదేవతగాను, అడవిప్రాణుల రక్షకుడుగాను చలామణి అవుతుండేవాడు. ఆతడు ఆ పద్ధతికి ఒప్పుకోలేదు.

"అమ్మా, నాన్నలకు పోట్లాట పెట్టటం మహా పాపం అవుతుంది. అయితే వారిని దూరంగా ఉంచటం మంచి మార్గమే; నాన్నను పైకి దూరంగా విసిరివేసి అమ్మను మన కాళ్ళకింద ఉంచుకోడం మంచిది. ఇలా చేసే నాన్న పైన చాలా దూరంలో మనకు అపరిచితుడుగా ఉండి పోతాడు. ప్రేమమూర్తి అమ్మ మన దగ్గరే ఉంటుంది" అన్నాడు.

అతని సలహా 'తౌహరీ' అనే వాడికి తప్ప అందరికీ నచ్చింది. 'తౌహరీ' వరుణ దేవత. అమ్మనూ, నాన్ననూ వేరుచేసి, నాన్నను పైకి దూరంగా పంపితే, తన పని సాగదనుకున్నాడు. కాని, చాలాసేపు చర్చించిన తర్వాత అమ్మనూ, నాన్ననూ విడదీసేందుకే అతడు కూడా అంగీకరించాడు.

ఒకనాడు అంతా ఒకచోట చేరారు. అమ్మనూ, నాన్ననూ విడదీసే పనిని ఎవరికి అప్పగించాలి? అంతా ఒకరిముఖాలొకరు చూసుకోసాగారు.

కొంతసేపటికి అందరికంటే పెద్దవాడైన ఆహార పదార్థాల దేవత 'రంగో' అనేవాడు ముందుకువచ్చాడు. అతడు అమ్మా, నాన్నల మధ్య నిలబడి వారిని విడదీసేందుకు ఎంతో ప్రయత్నించాడు. ఎంత ప్రయత్నించినా ఫలితం లేకపోయింది.

అటు తర్వాత సరీసృపాల దేవత అయిన 'తంగరో' రంగంలోకి దిగాడు. అతడు కూడా ఎంతో ప్రయత్నించాడు. తన శక్తినంతా ఉపయోగించి కూడా ఫలితం సాధించలేకపోయాడు. 'తంగరో' తర్వాత 'హోషియో' అనే తరళ పదార్థాల దేవత తల్లీ, దండ్రీ అయిన భూమ్యాకాశాల మధ్య నిలబడ్డాడు. అతడు కూడా వారిని విడదీసేందుకు గట్టి ప్రయత్నం చేశాడు. కాని లాభం లేకపోయింది.

తంగరో తర్వాత యుద్ధ దేవత 'తు' అనేవాడు ఆవేశంతో ముందుకు వచ్చాడు. శక్తినంతా కూడగట్టుకొని చాలాసేపు ప్రయత్నించాడు కాని, అతడు కూడా విఫలుడై ఫలాయనం చిత్తగించాడు.

కట్ట కడపట అడవి దేవతయగు 'తనే' శాంతంగా నిలబడ్డాడు. అతను కూడా రెండు చేతులతో బలాన్నంతా ఉపయోగించి అమ్మా, నాన్నలను విడదీసేందుకు ప్రయత్నించాడు. కానీ సాధ్యపడలేదు.

కొంతసేపు అతడు మౌనంగా ఉన్నాడు. తర్వాత అతడు తలను భూమికీ కాళ్ళను ఆకాశానికీ ఆన్చి శక్తినంతా కూడగట్టుకొని భూమ్యాకాశాలను వేరు చేసేందుకు ప్రయత్నించాడు. అది చూసి భూమి, ఆకాశం "ఎందుకురా మమ్మల్ని బలవంతంగా విడదీస్తున్నావు? నీ తల్లిదండ్రులను విడదీసే పాపానికి ఎందుకు ఒడిగడుతున్నావు?" అని విలపించసాగాను.

కాని 'తనే' వారి మాటలను లెక్క చేయలేదు. అతడు భూమిని తలకింద అణచిపెట్టి ఆకాశాన్ని పైకి నెట్టసాగాడు. 'తనే' యొక్క ఈ ప్రయత్నంతో ఆకాశం భూమికి చాలా దూరంగా పోయింది. భూమ్యాకాశాలు ఒకదానికొకటి దూరం కావటంతో ప్రపంచంలో కాంతికిరణాలు ఆవిర్భవించాయి.

జగమంతా వెలుగుతో నిండిపోయింది. భూమి, ఆకాశాల సంతానమంతా అంధకారంనుంచి బయటపడింది.

'తౌహరీ' అనే వరుణదేవత గాలివానలకూ, తుఫానుకూ కూడా అధిదేవత. ఇతడే మొదటినుండి అమ్మా, నాన్నలను విడదీయటానికి అనిష్టంగా ఉన్నవాడు. భూమి, ఆకాశాలు వేరుపడటం చూసి చాలా భయపడ్డాడు.



ఇక భూమి మీద ఉంటే లాభంలేదు అనుకున్నాడు. అందువల్ల అతడు తండ్రియైన ఆకాశం వద్దకు వెళ్ళాడు. అక్కడినుంచి భూమి మీదికి భయంకరమైన పెనుగాలులనూ, జడివానలనూ, తుఫానులనూ పంపసాగాడు.

తౌహరీ చేసే ఆకతాయి పనులనూ, ఆటంకాలనూ లెక్క చేయకుండా భూమ్యాకాశాల బిడ్డలు. కష్టపడి పనిచేస్తూ అన్ని అవాంతరాలనూ ఎదుర్కొనే శక్తిని సంపాదించి హాయిగా జీవించ సాగారు.

భూమినుంచి ఆకాశం వేరుపడి చాలా యుగాలు గడిచాయి. ఇన్ని యుగాలు గడిచినా ఆకాశం తన భార్య 'పాపా' వియోగాన్ని మరిచి పోలేదు. ఇప్పటికీ అతడు విలపిస్తూనే ఉన్నాడు. అతని కన్నీళ్ళు ఈనాటికీ మంచుబిందువుల రూపంలో పచ్చికపై కనిపిస్తూనే ఉన్నాయి.

పాపా కూడా భర్త వియోగంతో ఏడుస్తూ ఉంటుంది. నిట్టూర్పులు విడుస్తూ ఉంటుంది. భూమిపైనుండి ఆకాశంవైపు వెళ్ళే పొగమంచు ఆమె నిట్టూర్పు తప్ప మరొకటి కాదు! *

# 6. సోమరిపోతు శిష్యుడు

**[పట్టుదల, జిజ్ఞాస, జాగ్రత్త-ఈ మూడు మాటలనూ తన సోమరిపోతు శిష్యునికి ఒక గురువు ఉపదేశించాడు. గురువుగారు ఉపదేశించిన ఈ మూడు మాటలనూ 'తు.చ.' తప్పకుండా పాటిస్తూ బర్మాలోని ఒక బాలుడు ఆఖరుకు మాండలే ప్రాంతానికి రాజు కూడా అయాడు. ఆ సోమరిపోతు శిష్యుడు రాజు ఎలా అయాడు-ఈ రహస్యాన్ని తెలియజెప్పే బర్మా జానపద గాథ ఈ 'సోమరిపోతు శిష్యుడు'].**

**చా**లా కాలం కిందటి మాట. బర్మాలో ఒక గ్రామంలో 'మోంగ్ పౌక్ క్యాంగ్' అనే పేరు గల ఒక బాలుడుండేవాడు. అతడు చాలా సోమరి. విద్యాభ్యాసానికి ఆ బాలుని తలిదండ్రులు ఆశ్రమ పాఠశాలకు పంపారు. ఆ కాలంలో ఆశ్రమ పాఠశాలలల్లో చదువు పది సంవత్సరాలకు పూర్తి అయేది. సోమరితనంవల్ల ఆ బాలుడు పాఠశాలలో ఉంటూ పది సంవత్సరాలలో ఒక అక్షరం కూడా నేర్చుకోకుండా వృథాగా గడిపాడు. ఆ గడువు తర్వాత మిగతా విద్యార్థులందరూ ఆనందోత్సాహాలతో గురువుగారి దగ్గర సెలవు తీసుకొని వెళ్ళిపోయారు. కాని 'మోంగ్ పౌక్ క్యాంగ్' మాత్రం దీనంగా ఒక మూల నిలబడిపోయాడు.

అందరూ వెళ్ళిపోయిన తర్వాత గురువుగారు మోంగ్ పౌక్ క్యాంగ్‌ను పిలిచి "కుమారా, నీ దుఃఖానికి కారణం నాకు తెలుసు. కాని బాధపడవద్దు. నేను నీకు మూడు మాటలు చెప్తాను. ఆ ప్రకారం నడచుకుంటే జీవితంలో నీకు జయం లభిస్తుంది. సుఖపడగలవు" అన్నాడు.

ఆ బాలుడు వినయంగా "ఆజ్ఞాపించండి గురుదేవా! మీ ఆజ్ఞను జీవితాంతం పాటిస్తాను" అన్నాడు. గురువుగారు ఆ మూడు మాటలను గురించి ఇలా వివరించారు:

"మొదటిది - పట్టుదల. పట్టుదల ఉంటే నీవు నీ గమ్యాన్ని చేరుకోగలవు.

రెండవది - జిజ్ఞాస. జిజ్ఞాస ఉండి నీవు విషయ సేకరణ కొరకు ఇతరులను అడుగుతూ ఉంటే నీకు కావలసిన సమాచారాన్ని పొంద గలవు.

మూడవది - జాగ్రత్త. జాగ్రత్తగా ఉంటే నీవు బతికుండగలవు. ఈ మూడు మాటలనూ జ్ఞాపకం ఉంచుకో!"

తర్వాత ఆ బాలుడు గురువుగారి ఆజ్ఞ ప్రకారం ఆశ్రమ పాఠశాల నుంచి బయటికి వచ్చాడు.

'మోంగ్ పౌక్ క్యాంగ్' చిన్నప్పుడెప్పుడో మాండలే నగరాన్ని గురించి చాలా విన్నాడు. ఆ నగరానికి వెళ్ళాలనే కోరికతో కాలి నడకన బయలుదేరాడు. చాలా దినాలుగా ఆహారం లేకపోయినప్పటికీ అతడు నిరాశ చెందలేదు. ఆఖరికి మాండలే చేరుకున్నాడు. దారి పొడవునా గురువుగారి మొదటి ఉపదేశాన్ని గుర్తు చేసుకుంటూ వచ్చాడు. అందు వల్లనే తన గమ్యాన్ని చేరుకోగలిగాడు.

ఆ నగరంలో కూలి పనిచేస్తూ కడుపు నింపుకునేవాడు. అయి నప్పటికీ గురువుగారి రెండవ ఉపదేశం అయిన జిజ్ఞాసతో ఆ పట్టణాన్ని గురించీ, దాని విశేషాలనుగురించీ ప్రతి ఒక్కరినీ అడిగేవాడు.

అలా అడుగుతూ ఉండగా చివరికి ఆ నగరాన్ని ఒక రాణి పాలి స్తూందనీ, ఆ నగర ప్రజలకీ, మంత్రికీ రాణి పరిపాలన ఇష్టంలేదనీ, రాణికి వివాహం జరిపించి, ఆమె భర్తకు రాజరికాన్ని అప్పగించి రాజును

చేయాలని వారు కోరుతున్నారనీ అతడు తెలుసుకున్నాడు. అక్కడి నియమాన్ననుసరించి రాణిని వివాహం చేసుకున్నవాడే రాజవుతాడు. కాని విచిత్రమేమిటంటే ఆ రాణికి వివాహమైంది. అదికూడా ఒక్కసారి కాదు; మూడు సార్లు! కాని వివాహమైనరాత్రే రాజులు మరణిస్తూ వచ్చారు. ఈ విషయం విన్న తర్వాత ఇప్పుడెవరూ ఆమెను వివాహమాడటానికి ధైర్యంగా ముందుకు రావటంలేదు-అన్న విషయాలను తెలుసుకోగలిగాడు.

మరునాడు మోంగ్ పౌక్ క్వాంగ్ మంత్రి దగ్గరకువెళ్ళి రాణిని వివాహ మాడేందుకు ఇష్టపడుతున్నట్లు చెప్పాడు. మంత్రి చాలా సంతోషించి వెంటనే వివాహానికి ఏర్పాట్లుచేయించాడు. వివాహానంతరం క్వాంగ్ ఆ రాత్రి శయన గృహానికి వెళ్ళుతూ తన వెంట అరటి మొద్దు నొకదాన్ని తీసుకువెళ్ళి మంచం కింద దాచి ఉంచాడు. రాణి గాఢ నిద్రలో ఉన్నపుడు క్వాంగ్ తన స్థానంలో అరటి మొద్దును ఉంచి, రాణి వక్కన భర్త నిద్రపోతున్నాడనిపించేట్లు దానిపై దుప్పటికప్పి తను ఒకమూల



దాక్కున్నాడు. రాత్రి గడిచే కొద్దీ అతనికి నిద్ర ముంచుకురాసాగింది. కళ్ళు ఎర్రబడ్డాయి. కళ్ళుమూతలు పడసాగాయి. అయినా అతడు నిద్ర పోకుండా కూర్చొనే ఉన్నాడు. అతడు గురువుగారి మూడవ ఉపదేశం "జాగ్రత్తగా ఉండు" అనేదాన్ని జపిస్తూ ఉన్నాడు ఆఖరివరకూ. అర్థ రాత్రి తర్వాత అతనికి భయంకరమైన పాము 'బుస' వినిపించింది. ఇంటిపైనుండి ఒక భయంకర సర్పం స్తంభం నుండి కిందికి దిగి, రాణి మంచం దగ్గరకు వెళ్ళి, రాణి పక్కన ఒక పురుషుడు నిద్రిస్తూ ఉండడం చూసి కోపంతో బుసకొడుతూ తన పడగతో గట్టిగా కాటువేసింది. అంతే! ఆ పాము పదునైన కోరలు అరటి మొద్దు పొరల్లో ఇరుక్కుపోయాయి. విడిపించుకోడానికి పాము చేసిన ప్రయత్నమంతా విఫలమైంది. అంతలో రాణి మేల్కొంది. క్వాంగ్ తనవద్ద దాచుకొన్న బాకుతో ఆ పామును చంపివేశాడు. అది చూసి రాణి గట్టిగా అరుస్తూ క్వాంగ్‌ను కూడ బయటకు తోసి తలుపులు వేసుకొంది.

ముగ్గురు రాజులను చంపిన ఆ భయంకర సర్పం చనిపోయిందని తెలిసి మంత్రీ, ఆ దేశపు ప్రజలూ ఆనందంతో గంతులు వేయసాగారు. అంతా మోంగ్ పోక్ క్వాంగ్‌కు జేజేలు పలికారు. కాని రాణి మాత్రం దుఃఖ సాగరంలో మునిగిపోయింది. ఎవరితోనూ మాట్లాడేదికాదు. పడక గదిలోనే ఏడుస్తూ పడుకుని ఉండేది. రాణిని ఓదార్చటానికి క్వాంగ్ ఆమె దగ్గరకు వెళ్తే అతణ్ణి కూడా కసరికొట్టేది. అతడు చిన్నబుచ్చు కొని తిరిగి వచ్చేసేవాడు. అయినప్పటికీ క్వాంగ్ నిరాశ పడకుండా ఎప్పుడూ రాణిని సుఖపెట్టాలనే ప్రయత్నం చేస్తూ ఉండేవాడు. క్వాంగ్ రాణి దగ్గరకు వెళ్ళినప్పుడంతా "నీ దుఃఖానికి కారణమేమిటి? నాకు చెప్పు. నేను నీ దుఃఖాన్ని పోగొడతాను. నిన్ను సుఖపెట్టడానికి నా ప్రాణాలను కూడ బలి చేస్తాను" అని చెబుతూ ఉండేవాడు.

ఇలా మాటి మాటికీ క్వాంగ్ అడుగుతూండడంవల్ల రాణి కూడ విసుగు చెంది ఆఖరికి ఒకరోజున ఈ బాధ నుండి తప్పించుకోడానికి

ఇలా అంది: "నేను ఒక పొడుపు కథ ఇస్తాను. నువ్వు దానికి సరైన సమాధానం చెప్పగలిగితే నేను నీ అధీనంలో ఉంటాను. నీ ప్రతి మాటా వింటాను. సరైన జవాబు ఇవ్వకపోతే నీ తల తీయించేస్తాను. ఈ షరతు నీ కిష్టమైతే చెప్పు" అంది రాణి.

"నీ షరతు నా కిష్టమే. కాని నీ పొడుపు కథకు సరైన జవాబు చెప్పేందుకు నాకు పది దినాలు గడువు కావాలి" అన్నాడు క్వాంగ్. రాణి దానికి అంగీకరించి పొడుపు కథ చెప్పింది.

ప్రియుని రూపాన్ని పదిలంగా భద్రపరచుకునేందుకు
వెలగా వెచ్చించిందామె వెయ్యి నాణేలు
కేశ సౌందర్యాన్ని పెంచుకొనేందుకు
తలలో ముడుచుకొంది ప్రియుని అస్థికలను

పాపం! మోంగ్ పౌక్ క్వాంగ్ ఈ పొడుపు కథ జవాబు కోసం ప్రతివారినీ అడిగేవాడు. కాని ఎవరూ జవాబు చెప్పలేకపోయారు. అయినా అతడు పట్టుదల వదలకుండా అందర్నీ అడుగుతూ తిరగ సాగేడు. గడువు తొమ్మిది దినాలు గడచిపోయింది. ఇక ఒక్క దినం మాత్రమే ఉంది. అతడు నగరం బయటికి వెళ్ళి ఒక చెట్టు కింద కూర్చొని ఆలోచించసాగాడు జవాబు కోసం.

తమ కుమారుడు మాండలేకు రాజయాడనే విషయం క్వాంగ్ తల్లిదండ్రులకు తెలిసింది. వారు క్వాంగ్‌ను కలుసుకొనేందుకు బయలు దేరారు. మాండలే సమీపానికి చేరి వారు ఒక చెట్టు కింద కూర్చొని అన్నం తినసాగారు. అక్కడికి రెండు కాకులు వచ్చి వాలాయి. వాళ్ళిద్దరూ ఆ కాకులకు కొంత ఆహారాన్ని వేశారు. కాకులు కడుపునిండా తిన్నాయి. వాటిలో ఆడ కాకి "రేపు ఇంతకంటె మంచి ఆహారం దొరుకుతుంది" అంది.

"ఎలా?" అంది మగ కాకి.

"నీకు తెలియదా? రాణీగారి పొడుపు కథకు జవాబు చెప్పేందుకు రాజుగారికి ఆఖరి దినం కదా! ఆయన జవాబు చెప్పలేడు. షరతు ప్రకారం ఆయన తల నరికి ఆయన మాంసాన్ని కాకులకు వేస్తారుకదా!" అంది ఆడ కాకి.

"ఆయన జవాబు చెప్పగలిగితే?" అంది మగ కాకి.

"రాజు ఎప్పటికీ జవాబివ్వలేడు. దానికి జవాబు రాణీగారికీ, నాకూ తప్ప మరెవ్వరికీ తెలియదు. ఆ పామును చంపిన తర్వాత నేను అక్కడే ఉన్నాను. ఆ పాము మాంసం నాకు ఆహారంగా దొరుకుతుంది అనుకున్నాను. కాని దొరకలేదు. అసలు విషయమేమిటంటే - ఆ పాము రాణి ప్రియుడు. రాత్రులు రాణీ దగ్గరకు వచ్చి మనిషిగా మారి రాణీ దగ్గర గడిపేవాడు. ఉదయాన్నే సర్పంగా మారి వెళ్ళిపోయేవాడు. తన ప్రియుని ఆకారాన్ని భద్రపరచుటకు రాణీ ఒక పనివాడికి వెయ్యి నాణేలు ఇచ్చి ఆ పాము చర్మంలోపల గడ్డి నింపించింది. ఒక వడ్రంగికి వెయ్యి నాణేలు ఇచ్చి ఆ పాము ఎముకలతో తల పిన్నులు చేయించు కొంది. రాణి వాటిని ధరిస్తూ ఉంటుంది."

కాకుల సంభాషణ విన్న వెంటనే క్వాంగ్ తల్లిదండ్రులు ఈ వార్తను తమ కుమారునికి అందించడానికి వెంటనే బయలుదేరారు. దారిలోనే ఏకాంతంగా చింతిస్తూ కూర్చున్న కుమారుణ్ణి కలుసుకుని కాకుల ద్వారా విన్న విషయాన్ని అతనితో చెప్పారు. క్వాంగ్ పొడుపు కథకు జవాబు దొరికింది. మరుదినం క్వాంగ్ రాణీ ముందు పొడుపు కథకు జవాబు చెప్పి, ఆమెను తన దానిగా చేసుకొని సుఖంగా రాజ్యమేల సాగాడు.

*

# 7. ఆదిమ పురుషుడు

[భూమి మీద మొదటి మానవుడి పుట్టుకకూ, అతని సంతానం అభి వృద్ధికి సంబంధించిన పరిణామ విధానాన్ని తెలిపే మెడగాస్కర్ జానపద కథ "ఆది పురుషుడు."]

మొట్ట మొదటిసారి భూమి మీద మానవ రూపంలో జన్మించిన వాడు ఇట్ సే. అతడు మెడగాస్కర్ ద్వీపంలో ఒంటరిగా, సంతోషంగా కాలం గడుపుతూ ఉండేవాడు. ఒకరిని గురించి పట్టించుకొనేవాడు కాదు. పగలంతా తిరుగుతూ, దొరికింది తింటూ, రాత్రంతా ప్రశాంతిగా నిద్ర పోయేవాడు. ఇదే ఆయన దినచర్య పని. ఇట్ సే తప్ప ఆ ద్వీపంలో మరో మానవ ప్రాణి లేదు.

ఇట్ సే తన ఆకారాన్ని సముద్రపుఒడ్డున ఉన్న నీటి గుంటలలో చూసుకొని చాలా ఆనందపడేవాడు. ఒక రోజున ఇట్ సేకు తన ఆకారం లాంటిదే ఇంకోటి తయారు చేయాలన్న కోరిక కలిగింది. ఒకటి తర్వాత ఒకటి ఇలా పది విగ్రహాలను తయారు చేశాడు.

పదవ విగ్రహం తయారయిన తర్వాత ఈశ్వరుడు తన పని మనిషిని పిలిచి, "ఇట్ సేతో నీ వివాహం జరిపించాలనుకుంటున్నా. నీ ఉద్దేశ్యం ఏమిటి?" అన్నాడు.

"నాకు ఇష్టమే. మీరు ఏది మంచిదనుకుంటే అలానే చేయండి. కాని ఇట్ సే నన్ను వివాహం చేసుకోకపోతే ఏం చేయాలి?" అంది.

"ప్రయత్నించి చూడు. ఇట్సే ఏం చేస్తాడో చూద్దాం" అన్నాడు ఈశ్వరుడు.

ఈశ్వరుడు పనిమనిషికి ఏనిమిది కుండల నిస్తూ "ఇవి తీసుకుని భూలోకానికి పో! మొదటి కుండలో 'వలి' ఉంది. దీనిని ఇట్సే దగ్గర తెరువు. వేడి కోసం నీ దగ్గరకు వస్తాడు. రాకపోతే రెండవ కుండను తెరువు. దానిలో 'వేడి' ఉంది. తెరుస్తూనే వేడి ఇట్సేను చుట్టుకుంటుంది. నీ బాహువుల చల్లదనం కోసం నీ దగ్గరకువస్తాడు."

కొంచెసేపు ఆగి ఈశ్వరుడు మరల ఇలా అన్నాడు: "రెండవ ప్రయత్నం కూడా ఫలించక పోతే మూడవ కుండను తెరువు. అందులో 'దప్పిక' ఉంది. దప్పికతో నీళ్ళకోసం నీ దగ్గరకు వస్తాడు. నీవు వెంటనే రుచికరమైన భోజనం చేసిపెట్టు. అతను సంతోషంతో నిన్ను మోహిస్తాడు." అన్నాడు.

"అప్పుడు కూడా నా దగ్గరకు రాకపోతే ఏం చేయాలి?" అని పనిమనిషి అడిగింది

"ఇట్సే అప్పుడు కూడా నీ దగ్గరకు రాకపోతే ఈ అయిదవ కుండ అతని ముందు తెరువు. గుంపులు గుంపులుగా దోమలు బయటికి వచ్చి అతన్ని కరుస్తాయి. వాటినుండి తప్పించుకోడానికి నిన్ను శాలువ అడుగుతాడు. నీవు వెంటనే శాలువ కప్పి అతణ్ణి నీవైపుకు లాక్కో–" అన్నాడు ఈశ్వరుడు.

"నిన్ను శాలువ అడగకుండానే దోమల బారినుండి అతడు తప్పించుకుంటే ఆరవ కుండను తెరువు" అన్నాడు. "దీనిలో ప్రపంచంలో ఉన్న దురదంతా నింపబడి ఉంది. ఇట్సే 'దురదతో' బాధ పడుతూంటాడు. అప్పుడు ఈ డబ్బీలోని మైనాన్ని అతని ఒంటిపై రాయి. దురద పోతుంది. అతడు నీ దాసుడౌతాడు."

“మైనాన్ని రాయించుకోకపోతే ‘విసుగు’ నిండిఉన్న ఈ ఏడవ కుండ తెరువు. అతడు విసుగ్గా ఉన్నపుడు నీవు మంచి రసవత్తరమైన కథలు చెప్పి అతణ్ణి సంతోషపెట్టు. ఈ విధంగా కూడా అతడు నీ వశం కాకపోతే ఈ ఆఖరి ఎనిమిదవ కుండను తెరువు.

“ఇందులో నవ్వు నిండి ఉంది. ఈ కుండను తెరవగానే నవ్వులు చుట్టూ వ్యాపిస్తాయి. ఇట్‌సే ఇంతకు ముందెప్పుడూ నవ్వు వినలేదు. ఎలా నవ్వాలో కూడా అతనికి తెలియదు. అందువల్ల నవ్వులు వింటూనే నీ దగ్గరకు ఉత్సాహంతో వచ్చి ఆ నవ్వును అనుకరించే ప్రయత్నం చేస్తాడు. అప్పుడు నీవు నవ్వే విధానాన్ని నేర్పి, అతణ్ణి నీ వశం చేసుకో” అన్నాడు ఈశ్వరుడు.

దేవుని ఆజ్ఞమేరకు ఆ పనిమనిషి భూమి మీదికి దిగివచ్చి ఇట్‌సే దగ్గరకు వచ్చింది. ఇట్‌సే ఆమెను చూసి కూడా చూడనట్టుండి పోయాడు.



ఈశ్వరుని ఆజ్ఞ మేరకు ఆ పని మనిషి మొదటి కుండను ఇట్‌సే ముందుంచింది. పుల్లలు ఏరి నిప్పంటించి చలి నుండి తప్పించుకున్నాడు.

రెండవ కుండను తెరిచినపుడు చల్లని చెట్టు నీడకు వెళ్ళి, వేడి నుండి తప్పించుకోగలిగాడు. మూడో కుండను తెరిచినపుడు అరటిమొవ్వను తిని దాహం తీర్చుకున్నాడు. నాలుగవ కుండ తెరిచి అతని కోసం భోజనం తయారు చేస్తూండగా ఇట్‌సే అరటి పండ్లు తిని ఆకలి తీర్చుకొని ముభావంగానే ఆమె వైపు చూశాడు.

ఐదవ కుండ తెరువగా దోమల గుంపు అతణ్ణి చుట్టుముట్టగా ఇట్‌సే తన చేతులతో వాటిని దూరంగా తరిమివేశాడు. ఇట్‌సే శరీరంపై 'దురద' పెట్టినపుడు చెట్టు మొద్దుకు శరీరాన్ని రాసుకొని దురద పోగొట్టుకొన్నాడు. అతణ్ణి 'విసుగు' ఆవరించినపుడు కట్టెలు కొడుతూ గడిపాడు. ఆ పనిమనిషి కథలేమీ వినలేదు.

ఆఖరున ఎనిమిదవ కుండ నుండి నవ్వులు వినిపించగా చెవుల్లో వేళ్ళుంచి విశ్రాంతిగా నిద్రపోయాడు.

ఆఖరికి ఆ పనిమనిషి ఓడిపోయి ఈశ్వరుని దగ్గరకు స్వర్గానికి తిరిగి వచ్చి జరిగిందంతా ఈశ్వరునితో చెప్పింది. ఈశ్వరుడు కోపంతో ఆమెను ఒంటింట్లోకి పొమ్మంటూ, "నీకు ఈ వంట పని తప్ప ఇంకేం చేతకాదుపో!" అని కసిరాడు.

"ఇట్‌సేను ఎలా వశపరుచుకోవాలి? ఎలా వివాహితున్ని చెయ్యాలి?" అని ఈశ్వరుడు ఆలోచనలో పడ్డాడు. ఇదంతా చూసి ఈశ్వరుని కుమార్తె 'ఇవెలో' తండ్రితో, "నన్ను భూలోకానికి పంపండి. నేను ఇట్‌సేను వశపరుచుకుంటాను. తర్వాత మీకు ఇష్టమైతే వివాహం కూడా చేసుకుంటాను" అంది.

ఈశ్వరుని అనుమతితో ఇవెలో భూమిమీదికి వచ్చి నేరుగా ఇట్ సే దగ్గరకు వెళ్ళింది ఇవెలో సుందర వస్త్రాలు ధరించింది. ఆ వస్త్రాలు చాలా అందమైన వెలగల దారాలతో నేసినవి. ఇవెలో అందాన్నీ, ఆమె వస్త్రాలనూ చూసి ఇట్ సే మోహితుడైనాడు. ఇవెలోను తన దగ్గరే ఉండమన్నాడు.

ఇవెలో వచ్చిన తర్వాత ఇట్ సే విగ్రహాలు చేయటం మాని వేశాడు. ఎప్పుడూ ఆమె దగ్గరే ఉంటూ ఆమెనే చూస్తూ గడిపేవాడు. ఇలా చాలా సంవత్సరాలు గడిచిపోయింది. ఒకరోజు ఇవెలో ఇట్ సేతో ఇలా అంది; "నాకిక్కడ విసుగ్గా ఉంది. మీరు చేసిన విగ్రహాలతో ఆడు కోవాలనుకుంటున్నాను. కాని వీటిలో ప్రాణంలేదే! మా ఇంటికి పోతు న్నాను. అక్కడి నుండి తిరిగివస్తూ వాటికోసం ప్రాణం తీసుకవస్తాను" అంది.

ఇవెలో స్వర్గానికి వెళ్ళిన తర్వాత భూమి మీద అంధకారం వ్యాపించింది. కుండపోతగా వర్షం కురవసాగింది.

కొన్ని రోజుల తర్వాత ఇవెలో తిరిగి వచ్చింది. తన వెంట ఒక కుండలో ప్రాణం, సూర్యకిరణాలు తెచ్చింది. ఇట్ సే చేసిన విగ్రహాలకు ప్రాణం పోసింది. అవే ఇట్ సే, ఇవెలో సంతానంగా పిలువబడేవారు. మానవజాతి వీళ్ళ సంతానంవల్లనే ఉత్పత్తి అయిందని అంటారు.

ఇప్పుడుకూడా మెడగాస్కర్ ద్వీపపు ప్రజలు తుమ్మినపుడు 'ఇట్ సే' అని తమ ఆదిమ పురుషుణ్ణి గుర్తు చేసుకుంటారు. *

# 8. మినాయిగ్ కాబూ

[సుమత్రా ద్వీపంలోని ఇళ్ల పైకప్పులు వాలుగా ఉండవు. అవి గుండ్రంగా గుమ్మటాల లాగ కూడా ఉండవు. గేదెదూడ కొమ్ముల ఆకారంలో ఉంటాయి. సుమత్రా ప్రజలు ఆ ప్రదేశాన్ని 'మినాయిగ్ కాబూ' (గేదె దూడ జయించిన స్థలం) అని గర్వంగా చెప్పుకుంటారు. అయితే సుమత్రా ప్రజలకు గేదె దూడ అంటే అంత ఆకర్షణ, అంత వ్యామోహం ఎందుకు? సుమత్రా ద్వీపపు జానపద గాథ 'మినాయిగ్ కాబూ' చదివితే ఈ విషయాలు మీకు తెలుస్తాయి.]

ప్రాచీన కాలంలో జావా ద్వీపాన్ని మహా పరాక్రమవంతుడైన ఒక రాజు పరిపాలించే వాడు. ఆ రాజు వద్ద గొప్ప సేనా, రక రకాల యుద్ధ పరికరాలూ ఉండేవి. ఆ సేనతో ఆయన ఇండోనేషియాలోని అన్ని ద్వీపాలమీద పైకి దాడి చేసి, వాటిని వశపరచుకున్నాడు. కాని మన దేశంలోని, నికోబార్ ద్వీపానికి కొంచెం దూరంలో ఉన్న సుమత్రా ద్వీపపు పశ్చిమ భాగం ఇంకా మిగిలి ఉంది. ఆ చిన్న ప్రాంతాన్ని వశపరచుకోవడానికి యుద్ధం చేయటం వృధా అని రాజు అనుకున్నాడు.

రాజు తన దూతతో "సుమత్రా ద్వీపానికి వెళ్ళి, అక్కడి ప్రజలతో, మీరు మా రాజుగారి పాలన ఒప్పుకోండి, లేకపోతే యుద్ధంలో నాశనం చేస్తామని చెప్పు'' అని ఆజ్ఞాపించాడు.

దూత అక్కడికి వెళ్ళి రాజు ఆజ్ఞను తెలిపాడు. రాజాజ్ఞ విని అక్కడి ప్రజలు "మేము ఆలోచించుకొని ఒక నిర్ణయానికి వచ్చేటందుకు ఒక్క వారం సమయం ఇప్పించండి" అని దూత ముందు ప్రాధేయ

వచ్చారు. దూత వర్తమానం ప్రకారం రాజు వారికి ఒక వారం వ్యవధి ఇచ్చాడు. అక్కడి ప్రజలకు ఆలోచించుకునేందుకు సమయం అయితే దొరికింది కాని వారు ధర్మసంకటంలో పడిపోయారు – "ఏమి చేయాలి? ఈ దుస్థితి నుండి ఎలా తప్పించుకోవాలి?" అనే ప్రశ్న అందరినీ వేధించసాగింది.

మరుసటిరోజున ఆడ-మగ, చిన్నా - పెద్ద అందరూ కలిసి ఈ కఠిన సమస్య పరిష్కరించుకోడానికి ఒక సభ ఏర్పాటు చేశారు.

సభలో ఒకడు ఇలా అన్నాడు: "మనం రాజుగారి పరిపాలన స్వీకరిస్తే ఆయన మనందరినీ బానిసలుగా చేసి, మన పొలాలను స్వాధీన పరచుకొంటారు. అప్పుడు మన బ్రతుకులే దుర్భరమవుతాయి."

"రాజుగారు తప్పకుండా అలాగే చేస్తారు. కాని మనం అలా చేయనివ్వం" అని అందరూ అన్నారు.

"అయితే ఇంకేం చేయాలి? మనం ఆయనతో యుద్ధం చేద్దామా?" అని ఇంకొకడు అడిగాడు.

"రాజుగారి ముందర మన శక్తి ఎంత? మనం అతనితో యుద్ధం చేస్తే మనలో చాలామంది మరణిస్తారు. మన భార్యలను బానిసలుగా చేస్తారు. మన ఇండ్లను భస్మం చేసి, ఆస్తిపాస్తులను వశపరచుకొంటారు" అని మరొకడు అన్నాడు.

"అయితే ఏం చేద్దాం మరి?" అని ఒకరినొకరు ప్రశ్నించుకో సాగారు.

"శారీరకంగా మనకు శక్తి తక్కువైతే ఏం? పశు బలంతో ఏమౌతుంది? మనలో మనోబలం ఉన్నట్లైతే మనం ఎలాగైనా గెలువ గలం" అని ఒక ముసలి వాడన్నాడు. అందరూ అతనివైపు చూశారు.

ఒకడు ఈ విధంగా అన్నాడు: "మాలో మనోబలం తక్కువేమీ లేదు. మేమంతా స్వతంత్రంగా ఉండాలనే అనుకొంటున్నాం. స్వాతంత్ర్యం కోసం ఏమైనా చేయటానికి మేమంతా సిద్ధంగా ఉన్నాం."

"అయితే, మీరు ఏమైనా ఉపాయం ఆలోచించండి" అని ముసలి వాడన్నాడు.

సభలో ఒకసారి అన్ని గొంతులూ "మేమంతా మీతో ఉన్నాం. మీరే ఏమైనా ఉపాయంతో మమ్మలను అందరిని ఈ విపత్తు నుంచి కాపాడండి" అని అన్నారు.

కొంత సేపటివరకూ ముసలివాడు మౌనంగా ఉండిపోయాడు. సభలో మౌనం ఆవరించింది. నిశ్శబ్దాన్ని చీలుస్తూ ముసలివాడు ఇలా అన్నాడు: "అవును, నేను ఉపాయాన్ని ఆలోచించాను."

"ఏమిటి?" అని అందరూ అడిగారు. ముసలివాడు ఇలా అన్నాడు: "మనం రాజుగారితో యుద్ధం చేస్తే ఇరువైపులవాళ్ళూ చనిపోతారు. యుద్ధానికి బదులు దున్నపోతులను పోట్లాడిస్తాం. మనవైపు నుంచి మైదానంలో ఒక దున్నను వదులుతాం. రాజుగారు తన వైపు నుంచి ఒక దున్నపోతును వదులుతాడు రెండింటికి పోట్లాట జరుగు తుంది.

పోట్లాటలో మన దున్న చనిపోయినట్లయితే మనం రాజుగారి పరిపాలన స్వీకరిస్తాం. రాజుగారి దున్నపోతు చనిపోయినట్లయితే మనం ఎప్పటికీ స్వతంత్రంగా ఉంటాం. అప్పుడు రాజుగారికి మనపై దాడిచేసే అధికారం ఉండదు."

"మన దున్న చనిపోయినట్లయితే?" అని ఒకడు తన సందేహాన్ని వెలిబుచ్చాడు.

"మన దున్న గెలుస్తుంది! ఈ భారం నాకు వదిలేయండి మీరు. నేను మిగతా విషయాలు చూసుకుంటాను. మీరు రాజుగారికి ఈ సందేశాన్ని పంపండి" అని ముసలివాడన్నాడు.

ఈ సందేశం అందిన తర్వాత రాజు ఈ విధంగా మనసులో అనుకున్నారు:

"నేను కూడా యుద్ధంచేసి అలిసిపోయాను. యుద్ధంలో ప్రాణ నష్టం, ఆయుధాల నష్టం జరుగుతాయి ఇది ఒక సులభమైన పద్ధతి. సుమత్రాలోని ఆ చిన్న ప్రాంతం తప్ప మిగతా ఇండోనేషియా అంతా నా స్వాధీనంలో ఉంది.

నేను ఇప్పుడు అన్ని మూలలా వెతికించి ఒక పెద్ద బలమైన దున్నపోతును తెప్పిస్తాను సుమత్రా ప్రజలకు అంత చిన్న స్థలంలో ఇంత పెద్ద దున్నపోతు ఎక్కడ దొరుకుతుంది? గెలుపు నాదే!" రాజు సుమత్రా ప్రజలకు తన దూత ద్వారా అందుకు తనసమ్మతి తెలిపారు.

దున్నపోతుల పోట్లాటకు రోజు ఏర్పాట్లుచేశారు.

పోట్లాట రెండు రోజులు ఉందనగా ముసలివాడు ఒక దున్నను తెచ్చి దానికి తిండి ఏమి ఈయకుండా రెండురోజులు కట్టివేశాడు. పాపం, అది ఆ రెండు రోజులు ఆకలి దప్పులతో నకనకలాడింది.

పోట్లాట సమయం కాగానే దున్నకొమ్ములకు విషంలో ముంచిన సూదిలాంటి ఇనుప కొమ్ములు తొడిగి మైదానంలోకి తెచ్చి ఒక వక్కన నిలబెట్టారు.

రెండో పక్కన మైదానంలో రాజుగారి దున్నపోతును కూడా తెచ్చారు. అది చాల పెద్దది, దూరంనుంచి చూస్తే ఏనుగులాగ కనిపించేది. అది మైదానంలో తలవంచి ముక్కు పుటాలనుంచి గాలి అగ్గిలా వదులుతూ నిలబడి తన విరోధి కోసం ఎదురు చూడసాగింది.

సుమత్రా ప్రజల దున్నను చూసి రాజూ, అతని సేవకులూ నవ్వసాగారు. "మనం వీళ్ళను ఎంత మూర్ఖులనుకున్నామో దానికన్నా వీళ్ళు ఎక్కువ మూర్ఖులుగానే ఉన్నారు" అని రాజు పరిహసించాడు.

పోట్లాట సమయం కాగానే కొమ్ము బూరా ఊదారు.

రాజు దున్నపోతు దుమ్ము రేపుతూ, హుంకరిస్తూ ఎదురుచూడసాగింది. కాని రెండవవైపు నుండి హుంకారం వినిపించలేదు. మరి రెండో దున్నపోతు దానికి ఎక్కడా కనిపించలేదు.

సుమిత్రా ప్రజల దున్నముందు దూరంగా నిలబడిన రాజు దున్నపోతును చూసి దానిని తన తల్లి అనుకొంది. ఆకలితోవున్న ఆ దున్న దున్నపోతు దగ్గరికి పరిగెత్తింది. దాని కిందికి పోయి పాలు త్రాగటానికి తన తలను వేగంగా పైకెత్తింది.

దున్న ఇనుప కొమ్ములు ఆ దున్నపోతు కడుపులో చొచ్చుకొని పోగా ఆ దున్నపోతు కుప్పగా కూలిపోయింది

సుమత్రా ప్రజలు సంతోషంగా తమ దూడకు జేజేలు పలుకసాగారు.

రాజు మొహం చిన్నజేసుకొని జావాకు తిరిగి వెళ్ళిపోయాడు. తర్వాత ఎప్పుడూ సుమత్రా మీద ఆయన దాడి చేయలేదు. సుమత్రా ప్రజలు అప్పటినుంచీ నిశ్చింతగా స్వతంత్ర జీవనం గడుపసాగారు.

రాజు వెళ్ళిన తర్వాత సుమిత్రా ప్రజలు ఆ దున్న కొమ్ముల మీదున్న లోహపు కొమ్ములు తీసి, దాని తల్లి దగ్గరకు తీసుకుపోయారు. పాలు తాగిన తరువాత దానికి పూలదండ వేసి, అన్ని చోట్ల తిప్పి ఉత్సవం జరుపుకున్నారు.

ఆ దున్న జ్ఞాపకార్థంగా వాళ్ళు తమ ఇంటి కప్పులను దాని కొమ్ము ఆకారంలో నిర్మించుకోసాగారు. ఇప్పటివరకూ కూడా ఆ పద్ధతే అమలులో ఉంది.

ఇప్పుడు కూడా అక్కడి ప్రజలు గర్వంగా తమ ప్రదేశాన్ని "మినాయిగ్ కాబూ" అంటే "దున్నను జయించిన స్థలం" అని చెప్పుకుంటూ ఉంటారు. *

